Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యుం I.] మద్రాసు : 1941 వ సం॥ డిసంబరు నెల 5 వ తేది శుక్రవారం [నె 38 రు

## భారతీయ సైన్యం అభివృద్ధి.

### 18 నెలలలో 10 లక్షలు తయారు చేయబడిరి.

భారతీయ సైన్యంలోని జనరలు స్టాఫ్ డిప్యూటి చీఫ్ అగు మేజరు జనరలు మొల్సువర్తుగారు యీదిగువ రీతిని రేడియో ఉపన్యాసము నొసంగిరి :—1939 వ సంవత్సరములో యుద్ధం ప్రారంభమయ్యే సరికి యితర దేశాలవలెనే ఇండియా కూడ సిద్ధంగాలేదు. తరువాత ఇండియాకూడ ప్రశంసార్హముగ యుద్ధమునకు తోడ్పడెను. 18 నెలలలో సుమారు 10 లక్షల సైనికులు యంత్రసామగ్రి నిపుణులు తయారు చేయబడిరి. అంటే గత యుద్ధం నాలుగేండ్లలో తయారయినంత సైన్యం యిపుడే తయారయిందన్నమాట. కాని యీసారి సైన్యానికి యిదివరకు సైన్యానికి చాల వ్యత్యాసం ఉంది. సైన్యంయొక్క సప్లైలు, కావలసిన ఆయుధ పరికరాలు సరకులు యిప్పటివి వేరు. నేటి క్రొత్త రకం యుద్ధంలో ఆయుధ పరికరాలతో సైన్యాన్ని తయారు చేయాలంటే, యిపుడు 2 లక్షల 50 వేలమందికి కావలసిన ఖర్చు సరంజామా అంతా గత యుద్ధంలో పదిలక్షల మందికి సరిపోవును. 1914-18 వ సంవత్సరములలో మన సైన్యమునందున్న టెక్నీషియనులు—అంటే సేపరులు, మైనరులు, దారి సదును చేయువారు, సిగ్నల్సు యిచ్చేవారు, వైద్యులు, తుపాకులు వాడేవారు మున్నగువారు మొత్తం సైన్యంలో నూటికి యిద్దరుండేవారు. ఇపుడు నూటికి 20 మంది యీ టెక్నీషియనులుండుటయేకాక, కాల్బలం మోటారు దళములందుండు పెక్కండ్రు సైనికులకు మోటారులు నడుపుట, క్రొత్తరకాల ఆయుధాల మరమ్మత్తు చేయుట తెలిసియుండాలి.

గత యుద్ధంలో సైన్యంలో ఉన్నతోద్యోగులుగ కింగ్సు కమిషనులో చేరిన భారతీయులు బహుస్వల్పం. ఇపుడు ఎన్నోవందల మంది చేర్చుకొనబడ్డారు. ఇంకా ఎందరో శిక్షణ పొందుచున్నారు. ఇంతమంది చేరినా ఇంకా చాలరనుకుంటున్నాము. సైనికులు వేలకువేలు సేతువునుండి హిమాలయాలవరకూవున్న విశాల భారతఖండం అంతటిలో చేర్చుకొనబడుతున్నారు. టెక్నీషియనులను ఉద్యోగులను చేర్చుకొనుటయందు కొన్ని కష్టాలున్నాయి. నేటి సైన్యానికి అవసరమగు శాస్త్రీయ జ్ఞానంగలవారు దేశంలో తక్కువగ ఉంటారు. కావున అనేకచోట్ల శిక్షణశాలలు నిర్మించి వడిగ ఎక్కువమందికి శిక్షణ యొసంగబడుచున్నది. సైనికులుకన్న సైనికోద్యోగులు తగినవారు దొరకుట కష్టంగానున్నది. ఒక యువకుని తెచ్చి దుస్తులుతొడిగి, శిక్షణ శిబిరంలోకి పంపగానే చాలదు. ఉద్యోగులు సమర్థులు కాకపోతే, ఆఫ్రికాలో అనేకమందిగల ఇటలీ సైన్యం జనరలు వావెలుగారి నాయకత్వంలోనున్న సుశిక్షితులగు కొద్దిమంది బ్రిటిషు సైన్యానికి ఓడిపోయినట్లు ఓడిపోతుంది.

### సైనికోద్యోగి లక్షణాలు.

ఎటువంటి సైనికదళంలోనైనా నాయకత్వం వహించు ఉద్యోగి తన అనుచరులను యుద్ధరంగంలోనికి ధైర్యంగా తీసుకొనిపోగల సమర్థత కలిగియుండాలి. బ్రిటిషు సైన్యంలోను యితర ప్రజాప్రభుత్వంగల దేశాలలోని సైన్యాలకు శత్రువులు నిర్బంధంగా చేర్చుకొన్న సైన్యాలకు వ్యత్యాసం గలదు. మన సైన్యాలలో యుద్ధరంగమునందు ఊతపదం, "రా, ముందుకు రా" అని ఉంటే, శత్రుసైన్యాలలో "పో ముందుకు పో" అని హెచ్చరిక యుండును. అనగా మన సైన్యాలలో నాయకులు ముందుండి సైన్యాన్ని వెంట తీసుకపోతారు. అట్లా చావుకు తెగించి యుద్ధరంగంలోకి ఉరికే సైనికులకు తమ నాయకునియందు ఎంతో విశ్వాసముండాలి. ఆ విశ్వాసం బడయుటకు సేనానాయకుడు విషయపరిజ్ఞానం, ధైర్యం, చొరవ, స్వార్థరాహిత్యం, త్యాగబుద్ధి కలిగియుండాలి. వాటినే "పెర్సనాలిటి" (గాంభీర్యం, వ్యక్తిత్వం) అంటారు. సేనానాయకుడికి తన వశమునందున్న సైనికులకు ప్రోత్సాహం కలిగించే తెలివితేటలు వుండాలి. అశ్రద్ధ అజ్ఞానం, భీరుత్వంవలన తన క్రిందనున్న వందలకొలది సైన్యాన్ని తెలివితక్కువ చర్యలకు పురిగొల్పి హాని కలుగజేస్తే, తన చేతులలో వారిని చంపినట్లై యగును. సైనికోద్యోగులందరు యీ బాధ్యతను వహింపక తప్పదు.

గంభీర్యం, వ్యక్తిత్వంతోపాటు బాధ్యతవహించే సమర్థత కూడా యుండాలి. విశ్వవిద్యాలయంలో బి.ఎ., ఎం.ఎ., డిగ్రీలు పొందినవారందరు పుస్తకాలను బాగా బట్టీపెట్టగలరేమోకాని, కష్టాన్ని ఎదుర్కోలేరు. యుద్ధరంగంలో అనుకోని కష్టపరిస్థితులందు త్వరగ ఆలోచించి కార్యనిర్ణయం చేయగల సమర్థతకు డిగ్రీ నిదర్శనంకాదు. ఆఫీసులోనో వ్యాపారంలోనో శాంతంగానున్నపుడు సమర్థత చూపవచ్చును కాని ఫిరంగిగుండ్ల ఎదుట ప్రమాదాన్ని ఎదుర్కొన్నపుడు ఆ సమర్థత చూపలేరు. డబ్బువ్యాపారం చూచుకొనేందుకు యుద్ధంలో మనుష్యుల వ్యాపారం చూడ్డానికి వ్యత్యాసం

గలదు. సైనికాధ్యోగి తన సైనికులతో సర్వదా సంచరించుచు, ఆడుచు బోధించుచు, వారి సౌకర్యాలు కష్టసుఖాలు చూస్తు గార్డియను లాగుండాలి. యుద్ధంలో వారి శ్రేయం కాపాడాలి. భారతీయ సైనికోద్యోగి జాతిమత భేదాలు పాటించని వాడుగనుండాలి. అన్ని జాతుల వారు అతని సలహా సైకొనుటకు కుతూహలపడుచు, అతనివద్ద న్యాయందొరుకునను నమ్మకం కలుగునట్లుగా అతడు ప్రవర్తించాలి. కావున యిట్టి సైనికోద్యోగులను ఎంచడం ప్రభుత్వాధికారులకు సులభమైన పనికాదు. సైనికులు ఉద్యోగులు ఎంచబడిన తరువాత వారి వారి సమర్థతలు శిక్షణ శిబిరాలలోనే తెలిసిపోతాయి. బ్రిటిషు సామ్రాజ్యం అంతటిలోను సైనికోద్యోగులను ఎంచుట పైన తెలిపిన ఉన్నతాశయముల ననుసరించే జరుగుచున్నది. సేనానాయకుల సమర్థతపైనే సైనికుల ధైర్యస్థైర్య లాధారపడియుంటాయి. కనుక ఏ యుద్ధంలో అయినా జయాపజయములు సేనానాయకుల సమర్థత ననుసరించియుండును.

# లిబియాలో "జాలో" ఆక్రమణ

## భారతీయసేనల నేర్పు.

### ఎడారియందు 270 మైళ్ల దాడి.

నీరులేని ఎడారి యిసుకయందు 270 మైళ్లదూరం దాడివెడలినపిదప భారతీయులు, బ్రిటిషువారు దక్షిణాఫ్రికనులుగల సైన్యం లిబియాలోని జాలో అను పురమును, శత్రుసేనల నోడించి, వశపరచుకొనెను. ఆసైన్యంవెంటవున్న ఒకరు యిట్లు వ్రాసిరి :—

ఈదాడి చాల ప్రశంసార్హముగ తలపెట్టి నిర్వహింపబడినది. జాలో అను కొలనుగల పురము శత్రువుల ముఖ్యకేంద్రముగ నుండెను. ఆపురము పట్టుకొనుటకై బ్రిటిషు సమిష్టిసైన్యం నవంబరు 18 వ తేదిన జరీబూబ అను పురమునుండి బయలుదేరి ఎన్నోమైళ్లు నడచిపోయెను, గాని 21 వ తేది ఉదయంవరకు శత్రువుకంటబడలేదు. ఒక లోతైన యిసుకగుంటలోపడి సైన్యమంతా మోటారుబండ్లతోను, టాంకులతోనుకూడ పోవుచుండగ శత్రువిమానాలు మొదట చూచి గుండ్లు ప్రేల్చినవి. అప్పటినుండి 24 వ తేదిన జాలో వశమగువరకును ఆ విమానాలు గుండ్లు ప్రేల్చుచునే వున్నవి. కాని ఎక్కువ నష్టంకలుగలేదు. బ్రిటిషు సేనలు సాగుచునేయున్నవి. బ్రిటిషుసైన్యంలో 100 బండ్లు నాశనం చేయబడ్డాయనిమాత్రం జర్మనురేడియోలో చెప్పబడినపుడు ఆసైన్యంలోనున్నవారే విని నవ్వుకొనిరి. పైనుండి బాంబులు గుండ్లుపడుచున్నా తప్పించుకొని సైనికులు ముందుకి సాగిపోయి సేనానాయకుని ప్రశంసను బడసిరి.

22 వ తేదిన బ్రిటిషుసైన్యంలోని విమానాలనుకొట్టే తుపాకులు ఒక శత్రువిమానాన్ని పడగొట్టినవి. అప్పటినుండి శత్రువిమానాలు జాగ్రత్తగ నున్నవి. జాలో కొలనుకు తగిలియే కొంచెందూరంలోనున్న అగిలా, ఇఖేరా యను గ్రామాలను 22 వ తేదిన భారతీయసైనికులు వశపరచుకొనిరి. అందు 100 ఖైదీలు దొరికిరి. ఈగ్రామాలు పట్టుకొనుటచే జాలోయందున్న శత్రుసేన పారిపోవుటకు మార్గంలేకపోయింది. మరునాడు సాయంకాలం దాడి కొనసాగించి జాలో పురమునకు 24 వ తేది ప్రాతఃకాలమున చేరగల్గిరి. ఖర్జూరపుచెట్లను చేరగనే పంజాబీసైనికులు, డోగ్రాలు విడబడి ముందుకు రెండుమూడుమైళ్లు పోయేవరకు శత్రుజాడలేదు. బహుశః శత్రువునకు యీ దాడిసంగతి తెలియక, యింత వడిగా వచ్చుసరికి విస్మయంచెందియుండును. అక్కడనున్న పెద్దకోటను చేరుసరికి కోటలోనుండి ఫిరంగిగుండ్లు ఎదుర్కొన్నవి. నష్టం చాల స్వల్పం. ఒకగుండుపడి ఫోటోలుతీసే భారతీయసైనికుని కెమారాను చెడగొట్టెను.

ఆదేసమయాన తొమ్మిది శత్రువిమానాలు పై నగుపడి, చాల క్రిందవరకు జోరుగావచ్చి బాంబులు వేయసాగెను. మొదటివరుస బాంబులు వారు వేసిరో లేదో యింతలో బ్రిటిషువారి హరికేను ఫైటరు విమానాలు రెండు దూరంనుండి డేగలవలె వచ్చి, శత్రువిమానాల గుంపులోకి చొచ్చుకొని పోయినవి. శత్రువిమానాలు యెక్కువగావున్నను వెనుకకు పారిపోయినవి. కాని అందులో రెండు మాత్రం స్వస్థానం చేరలేకపోయినాయి. వాటిలో వైమానికులు ముగ్గురు, అగిలావద్ద దిగినవారు, ఖైదుచేయబడిరి. ఇంతలో శత్రు శిబిరాలలోని సైనికులు బ్రిటిషు టాంకుల నెదిరించి ముందుకు పోకుండ అడ్డిరి. శత్రు ఫిరంగులు పెద్ద మైదానం మధ్యలో స్థావర మేర్పరచుకొని, అన్ని వైపుల తిరిగి ఎదిరించుచు, త్రోవలేకుండ చేయుచుండెను. పగలే వాటి నెదిరించి పోతే చాల నష్టం కలుగునని, చీకటి పడువరకు బ్రిటిషు సైన్యం వేచియుండెను. రాత్రి 7-30 గంటలకు బ్రిటిషు ఫిరంగిదళము అచ్చోటుచేరెను. కాని ముందుగ భారతీయ సైనికులు శత్రు శిబిరాల పైకి సాగిపోయిరి. అతి నేర్పుగ నిశ్శబ్దంగా వడిగా పోయిరి. కొద్ది నిముసాలలోనే వెలుతురు కలుగజేయు శత్రువుల గుండ్లు ప్రక్కనుండి పోయినవి. కాని యింతలోనే "యా ఆలి" అను భారతీయ యోధుల విజయధ్వని వినబడెను. వెన్వెంటనే కొన్ని తుపాకుల ప్రేలిన శబ్దం వినరాగానే, మైదానంలోని శత్రు శిబిరం భారతీయులు వశపరచుకొన్నారని యితర సైన్యానికి తెలిసింది. ఇంకో సైనికదళం జాలో పెద్ద కోటను పట్టుకొనుటకు పోయెను. వారును యిట్టి జయధ్వానములే చేయుటచే, అదికూడ పట్టుబడి, శత్రువుల ముఖ్యమగు నిరోధం తొలగిపోయిందని తెలిసెను. మనవారు యిద్దరే

గాయబడిరి. వెలుపలనున్న శత్రు శిబిరాలు బాగా నిరోధించినవి కాని, కోట ఎట్టి నిరోధం లేక వశమయింది. కొందరు ఇటలీ సైనికులు లొంగుట చాల కష్టమయింది. కొందరు దాగియున్న మరఫిరంగులు గుండ్లు ప్రేల్చుచునే యున్నవి. అయినా మన సేన ముందుకి పోతూనేవుంది. ప్రేలిన గుండ్లచే కలిగిన ఎర్రనికాంతులు, భారతీయ సైనికులు చేతులతో విసరు బాంబులు ప్రేలుటచే వచ్చేపచ్చని మంటలు, ఎర్రపచ్చ కాంతులనిచ్చు శత్రువుల బుల్లెట్టుల రంగు రంగుల కాంతులతో ఆ చీకటి చేదించబడుచుండెను. చివరకు పట్టుదలతో జరుగుచున్న దాడిని సహించలేక ఇటలీ సైనిక దళం లొంగిపోయెను. భారతీయ సైనిక దళం యింకను ముందుకు పోయి ఎల్ఆబ్బాయందున్న మట్టి కోటనుగూడ సులభంగా వశపరచుకొనెను.

### 70 మంది శత్రు ఉద్యోగులు ఖైదీలగుట.

జాలో కోట వశమయినట్లు తెలియరాగానే నల్గురు బ్రిటిషు సైనికోద్యోగులు చేరువనున్న పురము ప్రవేశించి కావలావారిని బెదరించగా, వారు పురపాలకులున్న మందిరం చూపిరి. ఆ భవనంలోనున్న శత్రు సైనికాధికారులకు జాలోకోట పడిపోయిన విషయం తెలియదు కాబోలును, ఆ సమయంలో భోజనానికి పోతున్నారు. ఈ నల్గురు బ్రిటిషు సైనికోద్యోగులు రివాల్వరులు గురిచూపుచు వారి నెదుర్కొను సరికి, 70 మంది శత్రు సైనికోద్యోగులును పల్లెత్తు మాటాడకుండ లొంగిపోయిరి.

జాలో దాడియందు మొత్తం 700 ఖైదీలు, 30 ఫిరంగులు, అనేకం మరఫిరంగులు దొరికినవి. మనవారు 20 మంది చనిపోవుటో గాయపబడుటో జరిగెను. జాలో పట్టుబడుటకు ముందురోజునే యింకో సైనికదళం ఆయుధ మోటారులతోగూడ అగిలాపురము పైబడి 5 నిముసాలలో వశంచేసుకొనెను. ఈ యుద్ధాన్నే మహా యుద్ధంగా ఇటలీ వారు చెప్పుకొనిరి.

ఈ దాడియందు భారతీయ సైనికులు చాల అద్భుతముగ పనిచేసిరి. వారి జట్టులో ఒకరేన చావకుండా శత్రువును ఓడించుట మరీవిశేషం. చరిత్రాత్మకమగు యీ దాడి యందు పెద్ద కష్టమంతా యిసుకబయలు అగు ఎడారి దాటుటే. కొన్ని సమయాలందు మోటారు చక్రాలు యిసుకలో సగంవరకు కూరుకపోయేవి. ఇంకో సమయంలో పెనుగాలికి పైకెగిరి పోయినట్లుండేవి. ఇన్ని కష్టాలతో యీ విజయం బడయుటకు భారతీయ సేన గర్వపడవచ్చును.

---

# పసిఫికు సముద్రంలో యుద్ధ మేఘాలు.

## ఎ. బి. సి. డి. రాజ్యాల రక్షణ యత్నాలు.

మలయా కొననున్న సింగపూరు రేవుకు ప్రిన్సు ఆఫ్ వేల్సు అనే యుద్ధనౌక నాయకత్వమున కొన్ని యుద్ధ నౌకలు యీవారం చేరేయి. ఇవి బ్రిటిషువారివి. అమెరికా యుద్ధ నౌక ప్రెసిడెంటు హారిజను అన్నదియు మరొకటి కూడా ఆ ప్రాంతాలు చేరేయి. ఇపుడు సింగపూరులో పెద్ద నౌకాదళం జతకూర్చబడింది. ఇదంతా ఎందుకొరకు? పసిఫికు సముద్ర ప్రాంతాలందు యుద్ధం ప్రారంభించడానికి జపాను తొందరపడుతున్నట్లు జపాను మంత్రుల ప్రకటనల వల్ల అనుకోవలసి వస్తున్నది. ఈ వారం యుద్ధ సూచకమగు ప్రకటనలు, వదంతులు, బెదిరింపులు ఎక్కువైనాయి. జర్మనీ యిటలీలతో ఒడంబడిక చేసుకున్న అక్షరాజ్యాలకు చెందిన రాజ్యం, జపాను. అవతల యూరోపులో జర్మనీతో పోరుచున్నపుడే బ్రిటనుకు ఒత్తిడి కలిగించి, హిట్లరుకు సహాయం చేయాలని జపాను ఉద్దేశం.

జపానుయొక్క యీ ఉద్దేశం ముందుగనే తెలుసుకొని బ్రిటిషు-అమెరికా ప్రభుత్వాలు తగిన జాగ్రత పడుతున్నాయి. తూర్పు సముద్రాలందు అమెరికావారి ఫిలిప్పైను దీవులు, బ్రిటిషు సామ్రాజ్యమునకు చెందిన ఆస్ట్రేలియా, మలయా, బోర్నియోలో భాగము, న్యూగినీ మున్నగు దీవులు గలవు. డచ్చివారి యాజమాన్యంక్రింద నుండిన తూర్పుదీవు లెన్నో గలవు. ఈ దీవులలో యుద్ధానికి అవసరమగు ముడి పదార్థాలు, చమురు లభిస్తాయి. డచ్చివారి మాతృదేశమగు హాలెండును యూరోపులో జర్మనీ ఆక్రమించిన పిదప డచ్చి తూర్పు దీవులు స్వతంత్రంగా వున్నాయి. వాటిని అంతం చేస్తామని జపాను ఉద్యోగి యొకడు బాహాటంగా చెప్పెను. ఫ్రెంచివారిదగు ఇండో-చీనా తాయి దేశానికి (సయాం) తగిలియున్నది. ఫ్రాంసు ఓడిపోయిన తరువాత ఇండో చీనాను బెదిరించి వొప్పించి జపాను అక్కడ చాల సైన్యాన్ని చేర్చింది. రేవు స్థలాలను వశపరచుకొంది. ఇపుడా సైన్యాలను తాయి-సరిహద్దువద్ద సమకూర్చి ఆ దేశాన్ని ఆక్రమించుతానని బెదరిస్తున్నది.

### జపాను అవసరం.

జపాను యిదవరకై దేండ్లనుండి చీనాతో యుద్ధంచేస్తూ ఆ దేశంలో 5 రాష్ట్రాలను ఆక్రమించి మిగిలిన భాగాన్ని వశం చేసుకోడానికి వీలుకాక ఆ యుద్ధంలో విశేషం నష్టపోయి చాలకష్టపడుతున్నది. చీనాకు బ్రిటను అమెరికాలు ఆయుధాలపంపి అన్నివిధాల సహాయం చేస్తున్నవి. ఆసియా ఖండం తూర్పుభాగంలో అంతా తన అధికారమే ఉండాలికాని యూరోపుదేశాలకెట్టి నిమిత్తంవుండరాదని జపాను మొదటినుండి వాదించుచున్నది. ఈ విధానం బ్రిటను అమెరికా రాజ్యాలకు ఎంతమాత్రం నచ్చలేదు. ఇపుడు యూరోపులో రెండేండ్లాయి యుద్ధం ప్రారంభం కాగానే, యిదే సమయమని జపాను తూర్పున తనకార్యం సాధింపాలని చాల విధాల ప్రయత్నించుచున్నది. జపానుయొక్క

ఆగడం అంతకంతకు ఎక్కువవుతూవుంటే, బ్రిటను అమెరికా ప్రభుత్వాలు దానికి బుద్ధిచెప్పాలని ఎంచి, ముందుగ జపానుయొక్క ఆస్తులను తమ దేశంలో వున్నవాటిని ఘనీభవింపజేసి, ఆర్థిక బహిష్కారం చేసినవి. దీనితో జపాను వర్తకం మూడొంతులు పడిపోయింది. జపాను వర్తకంపైనే ఆధారపడియున్నది. అందుచే చాల కష్టపడుతున్నది. ఇపుడా ప్రాంతాలలో బ్రిటను అమెరికాలు సైనిక నౌకా దళాన్ని కూడా పెంచుచున్నాయి. ఇందుకు కారణం జపాను చర్యలే.

పసిఫికు సముద్రానికి యీ తీరాన్న జపాను, ఆ తీరాన్న అమెరికా వున్నాయి. ఉభయులకు సముద్రంలో కొన్ని దీవులు గలవు, నౌకాదళం విశేషంగా వుంది. అందుచే ఎప్పటికైనా అమెరికావే తనకు ప్రబల శత్రువవుతుందని జపానుకు తెలుసు. కావున అమెరికాతో రాజకీయ సంబంధం తెంచుకోకుండా రాయబారాలు సాగిస్తూనే లోలోపల యుద్ధ ప్రయత్నాలను జపాను చేస్తున్నది. మూడు నెలలనుండి యీ రాయబారాలు జరుగుతున్నాయి. ఇటీవల ప్రత్యేకంగా కురును అనే రాయబారిని అమెరికా ముఖ్యపట్నమగు వాషింగుటనునకు జపాను పంపింది. అచట అతను అమెరికా మంత్రులతో సంప్రదించుతునే వున్నాడు. ఆ సంప్రదింపులు మంచిమాటలలో జరుపుతూ వుండగానే, జపానులో మంత్రులు అమెరికా ఇంగ్లాండులపై కారాలు మిరియాలు నూరుతున్నారు. గత వారంలో రాయబారాలు తెగిపోయే యనే అన్నారు. కాని మళ్లా వెంటనే “లేదులేదు యింకా కొంతవరకు కొనసాగుతా” యని జపాను అధికారులు ప్రకటించారు. యుద్ధానికి తయారగుటకు వ్యవధి సంపాదించుటకే యీ ప్రకటన చేసేరేమో తెలియదు.

## అమెరికాతో రాయబారాలు.

ఈ రాయబారాలలో ముఖ్య విషయాలేమిటో స్పష్టంగా ఎవ్వరు చెప్పరు. కాని ఊహనుబట్టి యిలాగనుకోవచ్చును:—చీనాతో తాను చేస్తున్న యుద్ధంలో జోక్యం కలిగించుకోకూడదనీ, చీనాకు ఆయుధ సహాయం చేయడం అమెరికా-ఇంగ్లాండులు మానవాలనీ, తనపైగల ఆర్థిక బహిష్కారం తొలగించాలనీ జపాను కోరియుండవచ్చును. జపాను ప్రాంతాలలో ఇంగ్లాండు అమెరికాల జోక్యం పూర్తిగ తొలగించాలని జపాను ప్రధాని ఇటీవలచెప్పెను. తూర్పు ఆశియా వ్యవహారాలు అమెరికాకు తెలియవనియు, యీ ప్రాంతం సంపదాభివృద్ధికి సమిష్టి కృషి చేయాలని తాను ప్రయత్నించుచున్నదనియు అతడనెను. కాని తాను అక్ష రాజ్యాలతో సఖ్యతగనుండి, ఆ ఒడంబడికలోని బాధ్యత కూడ నిర్వహిస్తానని చెప్పుచుండెను. జపానులోని సైనికాధికారులు ఎంత నష్టమైనాసరే తూర్పుదేశాలలో జపాను అధికారం సుస్థిరంగా స్థాపించాలని పట్టుదలగనున్నారు. వారికి జపాను పత్రికలు బలపరచుచు ప్రోత్సాహ మొసగుతున్నాయి. అందుచే వారు జపాన్ను యుద్ధంలోకి దింపవచ్చును. ఇంకోవైపున వృద్ధ వర్గమువారు తొందరపడరాదని చెప్పుచున్నారు. చీనా యుద్ధంవల్లనేకాక, యితర దేశాలు అమలు జరిపిన ఆర్థిక బహిష్కారంవల్లకూడ జపాను చాల డబ్బు చిక్కులోపడియున్నది కనుక, ఇంగ్లాండు అమెరికా పెద్ద రాజ్యాలను యిపుడు డీకొనలేమని ఆ తెగవారు అభిప్రాయపడుచున్నారు.

జపానులో సైన్యంయొక్క అధికారం ఎక్కువే, కాని సైన్యాన్నికూడ కాదనగల అధికారం చక్రవర్తికివుంది. చక్రవర్తి సర్వాధికారి దైవాంశ సంభూతుడని వారందరి అభిప్రాయం. కనుక వారిని ఏ తెగవారు కాదనలేరు. అందుకే యిటీవల జపాను సైన్యంఅంతా చక్రవర్తి స్వంత అధికారం క్రిందకు మార్చడంలో ప్రత్యేకోద్దేశం లేకపోలేదు. అక్ష రాజ్యాలతో సఖ్యత కంగీకరించినపుడే, ఎట్టి పరిస్థితులలో గూడ అమెరికాతో యుద్ధానికి దిగరాదనే అభయం మంత్రులవద్ద చక్రవర్తి గైకొన్నట్లు తెలియవచ్చెను. కావున యిపుడా చక్రవర్తిగారే తమ సర్వాధికారం ఉపయోగించి యుద్ధం తప్పించాలి కాని వేరుమార్గం అగుపడదు. అని పాంగే పత్రిక యొకటి వ్రాసెను.

ఇన్ని చిక్కులుండబట్టే జపాను రాయబారాలు త్రెంచుకొని చొరవచేయలేకుండావున్నారు. ఇండో చీనాలో సైన్యాన్ని ఎందుకు చేర్చిందో జపాను సంజాయిషీ చెపితేనేగాని అమెరికా సంతృప్తిపడదని అధ్యక్షుడు రూజువెల్టు తెలిపెను. అమెరికా-జాపాను షరతులకు చాల ఎడమున్నది. చీనావే ముఖ్య వివాదాంశం. చీనాపై ఒత్తిడి జపాను తొలగించి, దురాక్రమణ చర్యలు మానితేగాని యీ రెండు దేశాలకు సంతృప్తికరమగు ఒడంబడిక కుదురదు.

## రక్షణ కార్యాలు.

ఎందుకైనా మంచిదని అమెరికా, బ్రిటను, చీనా, డచ్చి ప్రభుత్వాలు కలసి సమిష్టి రక్షణయత్నాలు చేస్తున్నాయి. దీనినే ఆ దేశాల నామాక్షరాలను కలిపి అ. బ్రి. చీ. డ. (ఇంగ్లీషులో ఎ. బి. సి. డి.) ఫ్రంటు అని ముచ్చటగ అంటారు. ఈ నాల్గు దేశాల సమిష్టి బలాన్ని ఎదుర్కోడానికి జపాను ఎంతో జాగ్రతగ ఆలోచించి మరీ నిర్ణయించాలి. అసలు ఇండో చీనాలోకే రాకుండా యిదివరకే చేయలేకపోతిమే యని యీ దేశాలలో పెక్కండ్రు అనుకొనుచున్నారు. కాని యికముందు జపాను ఏమి చొరవచేసినా నిరోధించబడును. ఇపుడపుడే రక్షణకార్యా లెన్నో చేశారు. డచ్చి దీవులలో 100 విమానాశ్రయాలు నిర్మించారు.

థాయిలాండులో జపాను దాడి నెదుర్కోడానికి తగు కట్టుదిట్టాలు చేయబడుతున్నాయి.

చీనాకు ఆయుధ సామగ్రి పోవుటకు మార్గమగు బర్మా రోడ్డుపై జపాను విమానాలు దాడిచేయకుండా, ముఖ్యమగు చోట్ల రోడ్డుప్రక్కను విమానాశ్రయాలు కట్టబడినవి. అమెరికా విమానాలు జపాను విమానాలు రాకుండా కాపలా కాస్తాయట.

# బ్రిటిషువారి క్రొత్త పెద్ద యుద్ధ నౌక.



హెచ్. ఎమ్. ఎస్. ప్రిన్సు ఆఫ్ వేల్సు దీనిపేరు. బ్రిటీషు యుద్ధ నౌకాదళంలో చిట్ట చివరకు చేర్చబడిన యీ నౌక జర్మనీవారి "బిస్మార్క్" అను పెద్ద యుద్ధ నౌకను ముంచడంలో తోడ్పడింది. చర్చిల్ ప్రధాని యీ నావపైనే అట్లాంటికు సముద్రంపై ప్రయాణంచేసి అమెరికా అధ్యక్షుడు రూజువెల్టును సందర్శించెను. ఇది యిపుడు సింగపూరు రేవుచేరెను.

ఈ నౌక పైనుండు విమానం గాలిలోకి 'కాటపుల్టు' సాధనచే ఎగురకొట్టబడుట యీ పటంలో కనబడుచున్నది.

---

బర్మాలో క్రొత్తసైన్యాన్ని చేర్చి, నేలపైగాని విమానాల ద్వారాగాని శత్రుదాడి వస్తే నిరోధించుటకు తగు రక్షణలు అమర్చుతున్నారు.

సింగపూరునందు ముట్టడి పరిస్థితులున్నట్లే ప్రకటించేరు. అక్కడను బ్రిటిషువారి చీనారేవగు హాంగుకాంగులోను మలయాలోను సైన్యాలు సిద్ధంగా వుండాలని ఉత్తరువుచేశారు. బ్రిటిషు ఇండియానుండి మరికొంత సైన్యం సింగపూరు పంపబడింది. బ్రిటిషు నౌకాదళం కొంత సింగపూరు చేరింది.

అమెరికావారి ఫిలిప్పైను దీవులందు సైనికులకు సెలవు రద్దుచేశారు. అచట ముఖ్యపట్నమగు మనీలాకు అమెరికా యుద్ధనౌకలు అపుడే చేరినవి. ప్రతిదినం సైనికాధికారులు కలసి చర్చించుకుంటున్నారు.

పసిఫిక్ సముద్రం మధ్యలోనున్న హవాయి దీవినుండి ఆస్ట్రేలియావరకు 5,000 మైళ్ళ మేరను వరుసగనున్న దీవులలో సైనికశిబిరాలను ఏర్పాటుచేయుటకు బ్రిటిషు, అమెరికా స్వతంత్ర ఫ్రెంచి ప్రభుత్వాలు కలసి ప్రయత్నం చేస్తున్నవి.

ఆస్ట్రేలియా న్యూజిలండు ప్రభుత్వాలుకూడ రానున్న ముప్పును గుర్తించినవి. ఆస్ట్రేలియా మంత్రివర్గం యీ విషయం చర్చించుచున్నది.

---

# సంగ్రామ సింహావలోకనం.

హిట్లరుగారు ప్రస్తుతం ఏంచేస్తున్నారయ్యా అంటే, వెనుకకు తిరిగి చూచుకుంటున్నారు. ఎందుచేతనంటే ఎవరైనా సరే ముందూ వెనుకా చూచుకుంటూ పనులు చేస్తూ ఉండాలి. ఇంతవరకూ హిట్లరు ముందుచూపేగాని, వెనుకచూపు లేకుండా పరుగెత్తినాడు. పోలెండు, హాలెండు వగైరా రాజ్యాలనన్నింటిని వరుసగా ఒకదానివెంట ఇంకొకటి జయించుకుంటూ రష్యాలోకి వచ్చాడు. ఇక్కడ అయిదు నెలలనుండీ ఆదేపనిగా అహోరాత్రాలు యుద్ధం చేస్తున్నప్పటికీ అంతు కన్పించటంలేదు. రెండు మూడు నెలలలో రష్యాను జయించవచ్చునని అంచనావేసుకొని, అహంకారంతో, అంతులేని ఆశతో, పోరాటం ప్రారంభించాడు. కాని, వేసుకొన్న అంచనాలు ఎందుకూ అక్కరకు రాలేదు. మూడు నెలల యుద్ధమేగదా అని దిగితే, దిగిన కొద్దీ అగాధంగా ఉంది. మూడునెలలపైన ఇంకొక మూడు నెలలు గడచినా ఈ దండయాత్ర మొండిసాగుతూనే ఉంది తలుచుకో తలచుకున్నంత అప్పు పుచ్చుకో అన్నట్లయింది. "కరిమకరికి మకరికరికిని" అని గజేంద్రమోక్షంలో చెప్పినట్లుగా, రష్యాకు జర్మనీకి యీ పోరాటం ఇంకా ఎంత కాలం ఇట్లా జరుగుతుంది? "ఠావుల్ దప్పెను మూర్ఛ వచ్చె తనువున్ డస్సెన్ శ్రమం బయ్యెడిన్" అన్నట్లుగా

ఉంది హిట్లరుకు. రష్యాలో చలి అపరిమితం. ఆచలికి అల వాటైన రష్యనులే దానిని భరించగలరుగాని ఇంకెవ్వరూ భరించలేరు. అటువంటి యమ చలిబాధలో మంచుగడ్డ లలో యుద్ధం బద్ధకిస్తుంది. యుద్ధం అబద్ధమై జర్మనీ పటా లాలు పలాయన మంత్రం జపించక తప్పదు. అందుకనే, యీ చలికాలం రాకపూర్వమే రష్యాను జయించాలని హిట్లరు సంకల్పించి సన్నాహాలు చేశాడు. కాని ఆ పప్పు అక్కడ ఉడకలేదు.

## రష్యాలో దక్షిణరంగం.

ఈ వారం వార్తలనుబట్టి చూడగా, రష్యా దక్షిణ భాగంలో రాస్టావు నగరంవద్ద యుద్ధం చాలా తీవ్రంగా జరుగుతోంది. రాస్టావు నగరం చాలా ముఖ్యమైనది. ఎందు చేతనంటే రష్యా దక్షిణ భాగంలో ఉన్న కాకసస పర్వత ప్రాంతాలకు రాస్టావునగరం సింహద్వారం వంటిది. ఈ కాకసస పరగణాలోనే, బాకూవద్ద గొప్ప కిరసనాయిలు గనులు ఉన్నాయి. ప్రపంచంలో ఉన్న కిరసనాయిలు గనులన్నింటిలోను బాకూ గనులు చాలా గొప్పవి. ఈ కిరసనాయిలుగనుల కోసం హిట్లరు అనేక అవస్థలు పడు తున్నాడు.

మొన్న నీ మధ్య రాస్టావు నగరంలో జర్మను సేనలు ప్రవే శించినవని జర్మనులే ప్రకటించారు. కాని రాస్టావునగరం చాలా బందోబస్తుగా రక్షింపబడుతోంది. సులభసాధ్యంగా శత్రువులకు వశమయ్యేదికాదు. అందువల్ల తిరిగి జర్మను సేనలు తోక ముడతపెట్టి కాలికి బుద్ధిచెప్పి వచ్చినదోవనే దయచేసినాయి. ఈవారం వచ్చిన వార్తలనుబట్టి లెక్క చూస్తే, రమారమి అరలక్ష జర్మనుసేన రాస్టావునగరంవద్ద నాలుగైదు రోజులలో భస్మమైపోయింది. అంతేకాకుండా, మిగిలిన జర్మనుసేన రాస్టావుకు పడమరగా 31 మైళ్ల వరకు తరిమివేయబడినది.

మొన్న రష్యా ప్రభుత్వపు వార్తాప్రచార కార్యదర్శి యీ విషయమై మాట్లాడుతూ ఒకగట్టిమాట అన్నాడు. "జర్మనుసేనలు ఎక్కడికి వెళ్లినా తిరుగులేదు అనే అహంకారం జర్మనులకు ఉంది. రాస్టావువద్ద కలిగిన అప జయంవల్ల యీ అహంకారమనే పైత్యవికారం చాలా వరకు తగ్గుతుంది" అన్నాడు. రష్యనుదెబ్బ దేవేంద్రలో కం చూపిస్తుందిరా అని జర్మను వీరులు తప్పకుండా గ్రహి స్తారు. అరలక్ష జర్మను వీరులు వీరస్వర్గానికి ఒక్కదెబ్బలో వెళ్లినందువల్ల హిట్లరుకు ఇప్పుడైనా జ్ఞానోదయమైనదో లేదో.

"జర్మనుసేనలు ఎందుకు వెనుకకు పారిపోయినాయంటే, ఆ ప్రాంతంలోని రష్యను ప్రజలమీద పగసాధించడానికి వెనుకకు వెళ్లినవి" అని జర్మనులు ప్రకటిస్తున్నారు. కొబ్బరిచెట్టు ఎందుకు ఎక్కినావురా అంటే దూడగడ్డికోసం ఎక్కినాను అని జవాబు చెప్పినట్లుగా ఉంది. రాస్టావు దగ్గర జరిగిన అపజయానికి, ఏవిధంగా సమాధానంచెప్పి సమర్థించుకోవలెనో తెలియక హిట్లరు నానాచిత్త సంక్షోభం లోపడి, అంత అవకతవకగా మాట్లాడుతున్నాడు. హిట్లరు మనస్సు ఎంత భీభత్సంగా ఉన్నదో ఆమాటలనుబట్టి గ్రహించ వచ్చు.

## రష్యాలో మధ్యరంగం.

రష్యాలో దక్షిణ రంగంలో యుద్ధం అట్లావుంది. ఇక మధ్య రంగంలో యుద్ధం ఎట్లావుందో చూడండి. మధ్యరంగం మహా సముద్రంగా ఉంది. రష్యాకు ముఖ్యపట్టణమైన మా స్కో మహా నగరాన్ని ముట్టడించడంకోసం జర్మను సేనలు బ్రహ్మాండంగా బయలుదేరివస్తున్నాయి. రమారమి నాలు గైదు లక్షలసేన పెద్ద మిడతలదండు లాగున వస్తోంది. మాస్కో నగరానికి ఉత్తరపువైపునుంచిన్నీ పడమటి వైపునుంచి న్నీ ఎక్కువగా యీ జర్మనుసేన వస్తున్నది. మాస్కో నగ రానికి 36 మైళ్ల దూరంలోకి జర్మనులువచ్చారు. "మా స్కో మీదికి వస్తున్నాం, ఇదుగో వచ్చేశాం" అంటున్నారు. మాస్కో నగరంలోవున్న ప్రజలందరూ చిన్నాపెద్ద కంఠంలో ప్రాణం ఉన్నంతవరకూ పోరాడి తీరవలెననే ప్రతిజ్ఞతో కత్తులు నూరుతున్నారు. మాస్కో నగరానికి రక్షణలు, బందోబస్తులు చాలా ఉన్నాయి. అందువల్ల మాస్కోను సమీపించే జర్మనుదండు మృత్యువును సమీపిస్తున్నదనే గ్రహించాలి. మండుతున్న దీపంచుట్టూ మిడతలు పురు గులుచేరి ముట్టడించినట్లుగానే ఉంటుంది. ఎంతమంది జర్మ నులు అక్కడ అగ్నిలో ఆహుతికావలసి ఉన్నదో, మిన్నూ మన్ను కానకుండా తిరుగుతున్న మతిభ్రష్టుడైన హిట్లరుకేమి తెలుస్తుంది? రష్యాతో యుద్ధం పూర్తికావలెనంటే జర్మను సైన్యం పూర్తికావాలి. నట్టనడి సముద్రంలో పెనుతు పానులో గాఢాంధకారంలో లంగరువేసిన నావలాగు న్నాడుహిట్లరు.

## జయించిన రాజ్యాలను మచ్చిక చేయుట.

ఇంతవరకూ జయించిన రాజ్యాలలోని ప్రజలున్నూ ప్రజా నాయకులున్నూ హిట్లరుమీద పండ్లుపటపట కొరుకుతున్నారు. "ఈ జర్మను పీడ మనకు ఎట్లా తొలగిపోతుందిరా? ఎన్నడు తొలగి పోతుందిరా?" అని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నారు. సమయం దొరికితే గంతువేసి దూకాలని జర్మనుపీడిత రా జ్యాలన్నీ పొంచి పొంచి చూస్తున్నాయి. ఈ జయించిన రాజ్యాలన్నీ హిట్లరుకు పక్కలో బల్లెములలాగున ఉన్నాయి. పాముల పుట్టమీద కూర్చున్నట్లుగా ఉంది హిట్లరుకు— అందువల్ల యీ జయించిన రాజ్యాల నన్నింటిని, ఎట్లాగైనా మచ్చిక చేసుకోవలెనని హిట్లరు ఆందోళన పడుతున్నాడు. ఈ రాజ్యాల నన్నింటిని తన శిష్యవర్గంగా ఒక కూటంగా ఏర్పాటుచేసి తాను ఆ ముఠాకు పీఠాధిపత్యం వహించవలె ననే ఉద్దేశంతో ప్రయత్నాలు చేస్తున్నాడు. "రష్యాలో ఉన్న సామ్యవాద పద్ధతికి మనమందరం ప్రతికూలంగా ఉండే వాళ్లమే" కనుక "మేము సామ్యవాద ద్వేషులము" అని ఆ రాజ్యాల వారందరిచేత ప్రమాణం చేయిస్తున్నాడు. హాలెండు, పోలెండు వగైరా తాను జయించిన చిన్న రా జ్యాల వాళ్లచేత ఆ ప్రమాణ పత్రాలమీద సంతకముచేయిస్తు

న్నాడు. బలవంతంగా వాళ్ల చేత వేలిముద్రలు వేయించితే ఏమి ప్రయోజనం? మేమందరము సామ్యవాద ద్వేషులము అనే బలాత్కార ప్రమాణముద్రలవల్ల ప్రయోజనం లేదు. బలవంతంగా చక్రాంకితాలు ఎర్రగా కాల్చిన ముద్రలతో వీపు మీద వేసినట్లవుతుంది. తాతాచార్యులుగారి ముద్ర బుజం తప్పినా వీపు తప్పదన్నట్లుగా ఉంది. సర్కసులోని సింహాలు లాగున ఆ రాజ్యాలన్నీ ఎట్లా ఆడిస్తే అట్లా ఆడుతున్నాయి. కాని, ఆడించేవానిని విరుచుకొని తినవలెనని ఆ సింహాలన్ని నోరు తెరుస్తూనే ఉన్నాయి. ఈ జయించిన రాజ్యాలనన్నిటినీ, ఏవిధంగా తన స్వాధీనంలోనికి తెచ్చుకోగలనా అని హిట్లరు ఆందోళన పడుతున్నాడు. కాని యిదే అతనికి అలవికానిపని. రాజ్యాలైతే జయిస్తాడు గాని ప్రజల హృదయాల నెట్లా జయిస్తాడు? రావణాసురుడు సీతను అపహరించి తెచ్చాడుగాని, సీతను వశపరచుకో గలిగినాడా?

## హిట్లరు-పటేను సమావేశం.

అందువల్ల, "ఇంత కష్టపడి జయిస్తే చేసిన పని అంతా వ్యర్థమై పోతున్నదేమిరా?" అని హిట్లరు పరితపిస్తున్నాడు. జయించిన రాజ్యాలను స్వాధీనపరచుకొని భుక్తపరచుకొనడం ఎట్లా? అనే విషయమై హిట్లరు ఇప్పుడు చాలా మథనపడు పడుతున్నాడు. హిట్లరు రష్యాలోని యుద్ధరంగపు మకామునుంచి బయలుదేరి ఫ్రాన్సుకు వచ్చాడు. ప్యారిసు నగర సమీపంలో మకాం చేసివున్నాడు. జర్మను ఆక్రమణలోలేనట్టి ఫ్రాన్సు దేశభాగానికి అధిపతి అయిన పెటేనుకూడా అచటికి వచ్చాడు. పెటేనుతో హిట్లరు సంభాషిస్తున్నాడు. ఫ్రాన్సుకు చెందిన ఆఫ్రికాలోని రేవులుకొన్ని తనకు వశపరచవలసినదిగా హిట్లరు అడుగుతున్నాడని తెలిసింది. ఫ్రాన్సును జయించిన వెంటనే ఫ్రాన్సున్నూ, జర్మనీయున్నూ ఒక యుద్ధవిరామపత్రం వ్రాసుకొన్నవి. ఫ్రాన్సు తాలూకు ఆ రేవులను జర్మనీకి వశపరచవలననే షరతు ఆ పత్రంలో లేదు. హిట్లరు వ్రాయించిన షరతులు అవి. కాని యిప్పుడు ఆ షరతుకు వ్యతిరేకంగా ఆ హిట్లరే మాట్లాడుతున్నాడు. అధర్మంగా మాట్లాడేవాళ్లకు పత్రాలు, ప్రమాణాలుకూడా ఎందుకు? విగ్రహాలు పగలకొట్టేవాడు దేవాలయాలు కట్టించడం ఎందుకు? హిట్లరు తత్వం అంటేనే ఇది.—

## ఉత్తరాఫ్రికాలో యుద్ధం.

హిట్లరుకు ఒకవైపున రష్యా యుద్ధం మహా సముద్రంగా అగాధంగావుంది. ఇంకొకవైపున జయించిన రాజ్యాలను జీర్ణించుకోలేకుండా వున్నాడు. ముందుకు పోతే నుయ్యి, వెనుకకు వస్తే గొయ్యి అన్నట్లుగా ఉంది. ఇది ఇట్లావుండగా మూలుగుతున్న నక్క నెత్తిమీద తాటికాయ పడినదన్నట్లుగా, ఉత్తరాఫ్రికాలోవున్న లిబియా రాజ్యంలోనికి బ్రిటిషు సేనలు చొరబడి అక్కడవున్న జర్మను సేనలను చావగొట్టుతున్నాయి. అక్కడ సిదిరజెగ్ అనే ప్రదేశాన్ని బ్రిటిషు సేనలు వారం రోజులక్రిందట పట్టుకొన్నాయి. ఇక్కడ బ్రిటిషు సేనలకుకూడా జవాబు చెప్పవలసిన అవసరం హిట్లరుకు కలిగింది. ఒకవైపున రష్యాతో పోరాడుతూవుంటే యీ సమయంలోనే రెండో వైపున బ్రిటిషువారుకూడా శత్రువును దెబ్బ కొట్టడం మంచిదని యీ మధ్య రష్యా ప్రభుత్వాధ్యక్షుడైన స్టాలిన్ అన్నాడు. ఆప్రకారంగానే జరుగుచున్నది ఇప్పుడు. తోక మీదను, తల మీదను ఒక్కసారిగా రెండు దెబ్బలు తగిలితే ఎటువంటి పాము అయినా ఘయిసలవుతుంది. అక్కడ రష్యాలో మాస్కో మీదకు జర్మను సేనలు నడుస్తున్న సమయంలోనే ఉత్తరాఫ్రికాలో బ్రిటిషు సేనలు కూడా దండయాత్ర సాగించినాయి. హిట్లరుకు ఇది కత్తెర బోను. నేడు సిదిరజెగ్ తిరిగి జర్మనుల వశమైనదని కూడా వార్తలు వచ్చాయి. సిదిరజెగ్ వారివశమైనా, వీరివశమైనా ముందున్న దింకా ముదుసుల పండుగ.

బ్రిటిషువారు కాచుకోవలసిన దెబ్బ యింకా పెద్ద దింకొకటి వున్నదని బ్రిటిషు ప్రధానియైన చర్చిలుగారు అన్నారు. ఇంగ్లాండు మీదకే జర్మను సేనలు దండెత్తి రావచ్చు. లేదా జర్మను విమానాలు తీవ్రంగా ఇంగ్లాండుమీద దండయాత్ర సాగింపవచ్చు. ఈ రెండు ఉపద్రవాలు రెండు పెనుభూతాల వంటివన్నారు. ఒకటి శాకినీ, రెండోది డాకినీ అన్నట్లుగా ఉన్నాయి. అందువల్ల ఇంగ్లాండులోవున్న ప్రతి పురుషుడూ 18వ సంవత్సరము మొదలు 50 ఏళ్ల వయస్సువరకూ నిర్బంధవిధిగా సైనికుడుగా తయారుకావాలన్నారు. 16 ఏళ్లు 18 ఏళ్ల వయస్సు మధ్యనున్న పడుచువాళ్లు-ఆడ పిల్లలు మొగ పిల్లలు కూడా యుద్ధ సన్నద్ధులుగా వుండాలన్నారు. పెళ్లికాని స్త్రీ లందరూకూడా చేరవలెనన్నారు. వీరందరికీ కావలసిన ఆయుధాలు తయారు చేసినామనిచెప్పారు. ఉన్న తుపాకులు, చేఫిరంగులు చాలకపోతే శూలాలైనా సరే, శిలలైనా సరే శత్రువుమీద ప్రయోగించవలెనన్నారు. రష్యాలోకూడా ఇదే పద్ధతి అవలంబిస్తున్నారట. భూమికి భారమైన భూత పిశాచాలన్నీ లేచిపోవుగాక అని చర్చిల్లు ప్రధాని మంత్రం జపిస్తున్నాడు. "జర్మనీ", "ముసులోనీ" అనే పేర్లుకూడా శాకినీ, డాకినీ అన్నట్లుగానే పిశాచాల పేర్లు కావుగదా?

## జపాను-అమెరికా సంభాషణలు.

జర్మనీకి ఇటలీతోడైనట్లుగానే, జపానుకూడా తోడుగా ఉంటానని ఒప్పుకున్నది. ఇతర రాజ్యాలమీద జర్మనీ దండెత్తుచున్నట్లుగానే, ఇదివరలో అబిసీనియా మీదకు ఇటలీ దండెత్తినది. అదేవిధంగా అక్రమంగా చైనామీద జపాను దండెత్తినది. ఈ అక్రమ దండయాత్రలలో ఆరితేరిన యీ మూడు రాజ్యాలు స్నేహబంధం విర్పరచుకొన్నాయి.

తాయిలాండు అనబడే సయాము-రాజ్యం బర్మాకు ప్రక్కనే సరిహద్దుగాఉంది. ఈ తాయిలాండు మీదకుకూడా దండెత్తుతానని జపాను బెదరిస్తున్నది. తాయిలాండుకు ప్రక్కగానున్న ఫ్రెంచి ఇండోచైనా రాజ్యంలోకి జపాను సేనలు యిదవరకే ప్రవేశించి ఉన్నాయి. చైనాలో జరిగే అక్రమ దంది

యాత్ర నేను సహించను అని అమెరికా ప్రభుత్వం అంటున్నది. చైనాకు ఆయుధాలు అమెరికా సప్లయిచేసి అనేక విధాల సహాయ చేస్తున్నది. అమెరికా సంయుక్త రాష్ట్రాల ప్రభుత్వం చెప్పే మాటలను జపాను శిరసావహించాలి. లేకపోతే, అమెరికాతో జపాను విరోధం పెట్టుకొని పోట్లాటకు దిగవలసివస్తుంది. అందుకని అమెరికాకు జపాను ప్రభుత్వం ఒక రాయబారవర్గాన్ని పంపించింది. అక్కడ సంభాషణలు సాగుతున్నాయి. ఎంత సాగినా తెగడంమాత్రంలేదు. "అమెరికాతో నాకు సంబంధంలేదు" అని తెంచుకొని పోగలిగినంత తెగువ జపానుకులేదు. అయిరోపా ఖండంలో అయిదువేల మైళ్ళ దూరాన వున్న జర్మనీవల్ల జపాను ఎట్లా సహాయం పొందగల్గుతుంది? అది అసాధ్యం; అసంభవం. తెల్లవారిలేస్తే అమెరికాతో జపానుకు లక్షలావాదేవీలు. అనేక సరకులు అమెరికానుంచి జపానుకు రావాలి. అంతేగాక, అమెరికాతో సమానమైనదానినే నేను అని జపాను పంతగించి గంతు వెయ్యలేదు. అందుకని, అమెరికా-జపాను సంభాషణలు ఇంకా సాగుతూనే ఉన్నాయి. ఎంత సాగినా సారాంశం తేలడంలేదు.

## ఆస్ట్రేలియా నావమంచబడుట.

ఈ సంభాషణలు అట్లా జరుగుతుండగా ఆస్ట్రేలియా కోస్తాకు సమీపంలో సిడ్నే అనే పేరుగల ఆస్ట్రేలియా దేశపు క్రూజరు యుద్ధనావ, **6,830** టన్నుల నావ, మొన్న ముంచివేయబడింది. సముద్రమార్గాలలో పొంచి దొంగచాటుగా తిరుగుచున్న జర్మను యుద్ధనావచేత ముంచబడింది. ఆస్ట్రేలియా సముద్రతీరంవరకు యీ దొంగ జర్మనునావ వచ్చి తిరుగుచున్నదని దీనినిబట్టి తెలుస్తోంది. కనుక సింహళం లంకకూ అనగా రామేశ్వరానికి ఆస్ట్రేలియా తీరానికి మధ్యనున్న సముద్రంలోకి కూడా అది రావచ్చు. ఇట్లా నడిసముద్రంలో నావను ముంచితే సముద్రమార్గ దిగ్బంధనం చెయ్యవచ్చునని జర్మనుల అభిప్రాయం. కాని, అది దుర్భ్రమ. ఒక సిడ్నీనావపోతే మళ్లీ ఇంకో సిడ్నీ నావ తయారుచెయ్యడానికి ఆస్ట్రేలియాలో అప్పుడే ద్రవ్యం వసూలవుతున్నది. సముద్రంలోనుంచి ఎన్ని చేపలు పట్టినా, తిరిగీ అన్ని చేపలు పుట్టుతూ ఉంటాయి అన్నట్లుగా బ్రిటిషు సామ్రాజ్యంలోని నౌకా బలంకూడా అక్షయంగా అజేయంగాఉంది.

## సవరణ.

నవంబరు **21** వ తేది యుద్ధ సంచికలో "ఆర్క్‌రాయల్" అను బ్రిటిషు యుద్ధనౌకను గురించిన వ్యాసమునందు ఆ నావయొక్క వడి గంటకు $34\frac{6}{11}$ మైళ్లనుటకు బదులు **103** మైళ్ళని పొరబాటున ప్రకటింపబడినది.

---

సలహా: ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.

[మదరాను సమాచారముల ఆఫీసరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS: PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.